ప్రియా దెయ్యంగారు

*నేనొక ప్రియమైన పిశాచిని*

# నరకలోకయాత్రా విశేషాలు – 2

MARCH 7, 2011 62 COMMENTS (HTTPS://PRIYADAYYAMGAARU.WORDPRESS.COM/2011/03/07/%E0%B0%A8%E0%B0%B0%E0%B0%95%E0%B0%B2%E0%B1%8B%E0%B0%95%E0%B0%AF%E0%B0%BE%E0%B0%A4%E0%B1%8D%E0%B0%B0%E0%B0%BE-%E0%B0%B5%E0%B0%BF%E0%B0%B6%E0%B1%87%E0%B0%B7%E0%B0%BE%E0%B0%B2%E0%B1%81-2/#COMMENTS)



ఏమిటీ ఈ మధ్య టపాల్లేవనుకుంటున్నారా? గాడిదపాలు జీర్ణమవటానికి ఇంతకాలం పట్టింది. అసలే నేను వట్టి మనిషిని కూడా కాను. అపార్థం చేసుకోకండోయ్, అసలు మనిషినే కాను, పిశాచిని కదా.

ఇక విషయానికి వచ్చేద్దాం. నరకంలో రోజులు బాగానే గడుస్తున్నాయి భజనతోనూ, యముడితోనూ, నాన్నారితోనూ. ఒకరోజు ఉన్నట్టుండి ఒక పక్కనుండి "హేమిటీ? ఇదేనా మీ వి"గ్నా"నము? మీ కన్నా అ అగ్నాలులే బెటర్ బ్రదర్" అన్న అరుపులు వినబడగానే ఏమిటా అని వెళ్ళి చూశా. అనుకున్నట్టుగానే అక్కడ మన ఏంటీవోడు, కోపంతో రుసరుసలాడుతూ.

"మీ ఇష్టం మీదేగానీ నా అభిప్రాయం నేను చెప్పానధ్యక్షా!" అంటూ పక్కనే మన వైయెస్సార్.

"ఏమిటీ సంగతి?" అని పక్కన ఉన్న ఒక పాపిని అడిగాను.

"పాప ఏడ్చింది" అని సమాధానం – చావకముందు ఆయనో గ్రైప్ వాటర్ కంపెనీలో ఉద్యోగిట.

"తెలుగు బ్లాగులు చదివించు. దెబ్బకి భయంతో నోరు మూసుకుంటుంది" అని సమాధానం చెప్పి అక్కడ ఉన్న కింకరుడిని అడిగాను విషయమేమిటని.

"ఏముందీ. రామన్నగారికీ రాజన్నగారికీ ఏదో వివాదం" చెప్పాడు కింకరుడు.

"నీపేరు పురుగేశనా లేక ఇలాంటి పేరుగల బంధువులు నీకు భూలోకంలో ఎవరైనా ఉన్నారా?" అడిగాను నేను

"రెండూ నిజమే! ఎలా కనిపెట్టావు?" అడిగాడు

"అదేమీ పెద్ద బ్రహ్మవిద్య కాదులే" అన్నాను. "అది సరే గానీ ఇంతకాలం వీళ్ళకి నరకం తప్పలేదా?"

"ఎంతకాలం. ఇప్పుడేకదా వచ్చింది. భూలోకంలో ఏడాది ఇక్కడ కొన్ని క్షణాలతో సమానం" అన్నాడు కింకరుడు "శిక్షలు పూర్తయ్యాక స్వర్గానికి పోతారు ఇద్దరూ"

"సరే. ఇంతకీ గొడవ ఏమిటి?"

"నరకంలో తనకోసం రామన్నగారు ప్రత్యేకంగా వసతి ఏర్పాటు చేసుకుని దానికి తెలుగు వసతిగృహం అని నామకరణం చేసుకున్నారు. అయితే నరకంలో కొద్ది రోజులుగా ఉన్న చోటు కొరతవల్ల ఆ తరవాత వచ్చిన రాజన్నకి కూడా అదే గృహంలో వసతి ఏర్పాటు చేశారు. ఆయనేమో దానిని రాజీవ్ తెలుగు వసతి గృహం అని మార్చేశారు. అదీ గొడవ"

"అవునా. మరి దీనికి పరిష్కారం?"

"ఏమో!"

"Whats the matter?" అంటూ వచ్చింది భజన. నాకర్థమయిపోయింది ఈ సమస్యకి పరిష్కారం దొరికింది అని.

*************************

ఎంతో సంక్లిష్టమైన సమస్యని చిటికెలో తేల్చేసింది భజన ద జీనియస్. ఎలా అంటారా? అక్కడికే వస్తున్నా.

తెలివిగా, తను పరిష్కారం సూచించకుండా, ఆ వసతిగృహ నిర్వాహణాధికారిచేత చెప్పించింది. ఆ అధికారి బెంగాల్ లో పెరిగిన తెలుగువాడు.

అతను రామన్ననీ రాజన్ననీ ఇద్దరినీ పిలిచి "అయ్యా, ఈ గృహంపేరు తె.రా.స. అని మారుద్దాం" అన్నాడు.

"ఏమిటీ? ఇద్దరు సమైక్యవాదులుండే గృహాన్ని తెరాస అంటారా? మేం బ్రతికినా ఒప్పుకోం" అని తేల్చేశారు.

"అయ్యా, నేను చెప్పేది పూర్తిగా వినండి. తెరాస పేరు పెట్టటం వల్ల ఇక్కడ ఉండే తెలంగాణా పాపులు గొడవ చెయ్యరు. మీ పని కూడా అయిపోతుంది. విన్-విన్" అనండి ఆ అధికారి

"అదెలా?" అడిగారు రామన్న, రాజన్న.

"కాస్త దగ్గరికి రండి చెబుతా. తెరాస అంటే **తె**లుగు **రా**జీబ **స**న్నిధి"

"రాజీబ ఏమిటయ్యా?" అడిగారు రాజన్న

"అదే, ఆయన బెంగాలీ తెలుగాయన కదండీ, **వ** బదులు **బ** పలుకుతారు" సర్దిచెప్పింది భజన

"సరే రాజీవ్ తెలుగు బదులు తెలుగు రాజీవ్ అయింది అంతే కదా! ఓకే" అనేసి వెళ్ళిపోయారు రాజన్న గారు.

"నేను దీనికి ఒప్పుకోను. ఆ రాజీవ్ పేరు ఉండడానికి వీల్లేదు" అని చిందులు తొక్కటం మొదలెట్టారు ఎంటీవోడు.

"అన్నగారూ. నా మాటవినండి" అనిగుసగుసలాడింది భజన "రాజీబ లో రా అంటే రామారావు, జీ అంటే ఇంగ్లీషు G, అదే గుడివాడ, మీ ఊరే, ఇక బ అంటే మీ అబ్బాయి బాలయ్య"

"హయ్యారే! ఇటువంటి గ్నానిని నేను నేటివరకూ చూడనేలేదు" ఉబ్బి తబ్బిబ్బయ్యారు అన్నగారు.

భజనా, యూ ఆర్ ఎ జీనియస్.

******************************

"అది సరే చిత్రగుప్తా! ఏదో భజన దయవల్ల ఆ వివాదం సద్దుమణిగింది. రేప్పొద్దున్న ఇక్కడ సమైక్య వేర్పాటు సమస్య వస్తే ఎలా? ప్రతీసారీ భజనమీద ఆధారపడటం అంత బాగుండదు కదా?" అన్నాడు యమరాజు.

"నిజమే ప్రభూ, ఈ సమస్య తీర్చటానికి భూలోకంలోనే ఓ తెలివైన వ్యక్తి ఉంది. ఫోనులో మాట్లాడదాం" అన్నాడు చిత్రగుప్తుడు.

"సరే లైన్ కలుపు" అన్నాడు యముడు.

"హల్లో" అవతలనుండో తీక్షణమైన స్వరం.

"అమ్మా, నేను చిత్రగుప్తుడిని. నీ సహాయం కోసం నరకాన్నుండీ కాల్ చేస్తున్నా"

"నువ్వెవడివయితే నాకేంటి. ముందు సీత పతివ్రతా కాదా అని సిగ్గులేని ఫ్రాయిడ్ రచనల ఆధారంగా తేల్చాలి. ఆ తరవాతే నీ సంగతి చూస్తా"

"అలా అనకు తల్లీ. ఇది జటిలమైన తెలంగాణ సమస్య"

"తెలంగాణానా. అయితే అది సమస్యే కాదు. విషయం చెప్పు"

"ఇక్కడ నరకంలో సమైక్య-తెలంగాణా గొడవ జరగకుండా ఉండాలంటే ఏమి చెయ్యాలి తల్లీ?" అడిగాడు చిత్రగుప్తుడు.

"అద్వానీ ముస్లింలకి సారీ చెప్పాలి" సమాధానం

యముడికి అర్థం కాలేదు – అద్వానీకీ తెలంగాణాకి సంబంధం ఏమిటన్నది.

"అలాగే తన్ హాయీ చదివిన వారు నాకు సారీ చెప్పాలి"

"చిత్రగుప్తా. నువ్వు చేసింది ఏ నెంబర్కి?" యముడికి అనుమానం వచ్చింది.

"ఇక్కడ రెండు నెంబర్లున్నాయి ప్రభూ, ఒకటి శ్రీకాకుళం రెండోది హైదరాబాద్. నేను రెండోదానికి చేశాను. మొదటి వ్యక్తి కూడా జీనియస్ అని విన్నా"

"సరే! ఈవిడ పరిష్కారం మనకి అర్థం కాదు గానీ, ఆ శ్రీకాకుళానికి చెయ్యి"

"సరే ప్రభూ!"

*********************

"హల్లో. ఎవరదీ?" అవతలనుండి పే…….ద్ద గొంతు

ఆ ధ్వనికి ఒక్కసారిగా నరకకంపం వచ్చింది. నరకలోకమంతా ఊగిసలాడింది.

"భలే! తన వాక్కుతోనే నరకాన్ని కంపించగలిగాడంటే ఈయన సామాన్యుడు కాడు. ఈ సమస్య తీర్చేస్తాడు" మెచ్చుకున్నాడు యముడు.

"హల్లో నేను చిత్రగుప్తుడిని నరకాన్నుండి"

"చిత్రగుప్తుడి పేరు చెప్పి హౌరా మెయిలు చేస్తే నేను భయపడతాననుకుంటున్నావా? ఆ అమ్మాయి చేత నన్ను అన్నా అని పిలిపించింది నువ్వే అని నాకు తెలుసు" అవతలనుండీ మార్మోగిన కంచుకంఠం

"అర్థం కాలేదు" తలగోక్కుంటూ చిత్రగుప్తుడు.

"నీకు అర్థం కాలేదు అంటే నమ్మటానికి నేను చెవిలో పువ్వు పెట్టుకోలేదు. నా చెవిలో పువ్వు ఉందని నిరూపిస్తే రంగనాయకమ్మ పుస్తకాలు చదవటం మానేసి సన్యాసులలో కలిసిపోతా"

"అయ్యా, నేను ఫోను చేసింది తెలంగాణా సమస్య పరిష్కారం కోసం"

"నువ్వు కెలుకుడుగాడివని నాకు తెలుసు. నీ మాటలు వీడియో రికార్డ్ చేస్తున్నా"

“మాటలకి వీడియో రికార్డింగా? చిత్రగుప్తా! భూలోకం సాంకేతికంగా అంత అభివృద్ధి చెందిందా?” అన్నాడు యముడు.

“ఏమో ప్రభూ. ఈయన అడిగిన విషయం గురించి తప్పా అన్నీ మాట్లాడుతున్నాడు. ఇప్పుడు చూడండీ ఫోను కూడా పెట్టనివ్వడం లేదు. మిమ్మల్ని గబ్బర్ సింగుగా వీడియో తీస్తానంటున్నాడు” వాపోయాడు చిత్రగుప్తుడు.

“అయితే ఇప్పుడెలా? భజనా, నువ్వే మమ్మల్ని రక్షించాలి” అని కోరాడు యముడు.

వెంటనే భజన రంగంలోకి దిగింది. ఫోనుని కాంఫరెన్సు మోడ్ లో పెట్టి రాయలసీమలోని ఒక పల్లెకి కలిపింది.

“హల్లో this is …. గదా భవన్” అవతలనుండి సమాధానం.

అంతే! శ్రీకాకుళం నుండి లైన్ కట్!

“హమ్మయ్యా!” అని ఊపిరి పీల్చుకున్నారు నరకలోకవాసులందరూ.

భజనా, యూ ఆర్ గ్రేట్ .. రియల్లీ రియల్లీ గ్రేట్!

FILED UNDER UNCATEGORIZED

## 62 Responses to *నరకలోకయాత్రా విశేషాలు – 2*

**భయంకర్ says:**
March 8, 2011 at 2:50 am
పొద్దున లేచిన దగ్గరనుండీ భజన భజన భజన మీద వర్ణనలే. నీచేత భజన చేయించుకోడానికే భజన పుట్టినట్టుంది.

**చాగంటి ధ్వని says:**
March 8, 2011 at 2:54 am
పిశాచనిర్ణయం అన్న మాట ఓ రకంగా ఒప్పుకునే మనిషినే అయినా, ప్రతిదానికీ దెయ్యాలవంక వంక చూడటం మంచిది కాదు అని తెలిసినవాడిని కూడాను. ఫ్రీ డం టూ కిల్ అనేది దెయ్యాన్ని బట్టీ, దానిచుట్టూ ఉన్న దెయ్యం మూకలనిబట్టీ మారుతూ ఉంటుంది.

**Bhayankar S says:**
March 8, 2011 at 2:56 am
@ దెయ్యం గారు
చిన్నప్పటి ఫ్రెండ్ ఇన్నేళ్ళ తర్వాత చస్తేఎంత థ్రిల్ ఉంటుందో నాకు తెలుసు. మీ ఫ్రెండ్ ని మీరు వీలయినంత త్వరగా చంపాలని, మీరిద్దరూ మా కాకినాడ స్మశాన ్కలిసి ఆస్వాదించాలని (అఫ్కోర్స్ ఆయనకి కొత్త కాకపోవచ్చు లెండి) మనఃపూర్తిగా ఆశిస్తున్నాను.

**కెలుకుపిట్ట says:**
March 8, 2011 at 3:00 am
Sorry Deyyam, I don’t want to agree with you. Because, I don’t want to hurt my blog viewers. You think that, everyone who enters your blog must agree with you or face death. You openly killed everyone who didnt like your view.

**పులుసు బొబ్బరధన్యం says:**
March 8, 2011 at 3:03 am
“టపా బాగుంది. చాలా బాగుంది. భజన విశ్లేషణ బాగుంది. సహజం గా నరకంలో లో జరిగేవే చక్కగా చెప్పారు.

మిగతా భాగాలు కూడా త్వరగా వ్రాసెయ్యండి.”

**దెప్పాలంటే says:**
March 8, 2011 at 3:07 am
“అవును మీరు చెప్పింది ముమ్మాటికి నిజం కోపం దెయ్యాలపై వుండాలి కాని స్మశానం పై కాకూడదు”

**రవళి తృష్ణ says:**
March 8, 2011 at 3:38 am
దెయ్యం గారు మీ రచన బాగుంది..భగవంతుడు మహిళలకు మాత్రమే సొంతం చేసాడు అన్ని రకాల పాత్రలను కడిగే అవకాశం..అందుకోండి మా వందనాలు..

**దంచు says:**
March 8, 2011 at 3:46 am
సోదిలక్ష్మి గారు. ముందుగా నా అభినందనలు అందుకొండి. మీ విశ్లేషణ , లాజిక్ ఎప్పటిలాగానే చాల బాగుంది.
ఇంతకుముందెపుడో ఒకసారి దొంగనాయకమ్మ ని ఏకవచనం తొ సంభొదించానని ఆవిడ ఫాన్స్ నా మీద గొడవకొచ్చారు. ఒక్కసారి కూడా అవిడ రచనలు చదవకుండా ఎలా ఎకవచనం తొ పిలుస్తున్నవ్ అని. ఇప్పుడు మీరు చూపించిన ఒక్క సాంపిల్ చాలు. ఎటువంటి విషపు పురుగొ.
ఈ విషపు పురుగులకి రెండు నాల్కలు ఉంటాయ్. ఒకసారి అసలు హత్యలే జరగలేదు అంటారు. ఒక్కోసారి అదే హత్యల మీద ఇలాంటి నికృష్ట విశ్లేషణలు చెస్తారు.
చెప్పుతీసుకు కొట్టేవారు లేక దొంగనాయకమ్మ లాంటివారి ఆటలు సాగుతున్నాయి.

**భవన్ గద says:**
March 8, 2011 at 4:52 am
కూరతీక్ƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪƪ మా ప్రియా దెయ్యాన్ని ఎమన్నావు , నేను లేని టైమ్ లో

**కారుతీక మెల్లకంటి says:**
March 8, 2011 at 4:55 am
అవేదో చిన్నప్పటి తీపి జ్ఞాపకాలు భవన్.. చిన్నప్పుడు ఒకసారి మరచెంబు తీసుకుని ప్రియా డిప్ప మీద ఒకటి పీకాను గుర్తుందా?? దాని గురించి ఇప్పుడు నరకంలో డిస్కస్ చేసుకుంటున్నారు.

**Malakpet Rowdy says:**
March 8, 2011 at 4:59 am
:))

**SHANKAR.S says:**
March 8, 2011 at 5:01 am
చక్కని పేరడీ. శృతి మించకుండా, ఎవరినీ నొప్పించకుండా అల్లరి చేస్తున్నారు. మిగిలిన మిత్రులు కూడా ఇలాగే లైట్ తీసుకుంటారని ఆశిస్తున్నాను.
ఓ సారి మా కాకినాడ స్మశానానికి వచ్చి చూడండి. మీకోసం చితి మంటల్లో, చింత చెట్టుకి ఏ.సి పెట్టిస్తాం కావాలంటే 🙂

**గవి రంధ్రం ఏనుగంత says:**
March 8, 2011 at 5:07 am
దెయ్యంగారు మీరంటే నాకు చాలా భయ్యం. నన్ను వదిలేయండి ప్లీజ్. నా కలలోకి వచ్చి పీడించడం ఇకనైనా మానుకోండి. 😦

**సేమ్యా అల్లంవారు says:**
March 8, 2011 at 5:16 am
ఇందుమూలంగా అందరికీ తెలియజేయునదేమనగా కులుక్ పేట్ గూండా తీరు మార్చుకుని మరో చెట్టు మీద నుంచి వేళ్ళాడుతున్నారహో…. 🙂

**మోతీ says:**
March 8, 2011 at 5:22 am
"నడిరేయి అవసరం లేదు.పట్టపగలు కూడా నిర్భయంగా చిన్నారి దెయ్యం నుండీ నుండి ముసలి దెయ్యం వరకు ధైర్యంగా తిరిగే స్వాతంత్ర్యం,భద్రత కావాలి."

**సుమార్ ఎస్ says:**
March 8, 2011 at 5:25 am
గనిరంధ్ర గారూ పిశాచం ఎవరో మాకూ చెప్పరా ప్లీజ్…

**ఫీ says:**
March 8, 2011 at 5:25 am
దెయ్యంగారు… మీరు ***** లు పెట్టండి….ఆ చిన్న జన కూడా చెయ్యద్దు భకూడా ఇవ్వొద్దు….ప్లీజ్…..!!! ఒక సజ్జెషన్ మాత్రమే… మీరు స్థాయి కోల్పోవద్దు….ప్లీజ్…..

**వంద లేతాంబర్ says:**
March 8, 2011 at 5:29 am
ఆత్మ నాకాంక్ష లన్నింటి జటిల పరచి
కాటి కాటికో తీరుగా చోటుమార్చి
యమునిటులదిప్పి గుప్తుని పాపపుటల
ఎక్కువారిని చంపిఉటేన్యాయమగును!!!"

**జమార్ ఫన్ says:**
March 8, 2011 at 5:32 am
ఇక్కడ ఎవరో బయ్యం గారు ఉన్నారు . ఈ బ్లాగుని చూస్తున్నారు గారంటీ

**సారాప్య కొత్తగూటి says:**
March 8, 2011 at 5:33 am
Tala gaaru you took words from my mouth 🙂

ఐతే మువ్వ గారు చెప్పినట్లు ఆ దెయ్యంమాత్రం చాల హుందా గా ఉంది .
కాకపోతే ఇలాంటి స్మశానాలవల్ల వల్ల పిశాచ జన్మకన్నా కన్నా నరకం మేలు అని ఒక ఉపయోగం ఉంది అది రక్తం ఫ్లో అవుతుంది అది ఒక్కటే ఉపయోగం .
కాని వీళ్ళ ని చూసినప్పుడు మాత్రం నాకు యముడు, చిత్రగుప్తుడు ఇలాంటి వాళ్ళ ల మీద గౌరవం రెట్టింపు అవుతుంది !"

**తాబేలు పెల్లి, says:**
March 8, 2011 at 5:35 am
పిషాచం గారూ, మీరు వాడిన తెలుగులో వ్యాకరణ దోషాలు చాలా ఉన్నాయి. తెలుగు దెయ్యమై ఉండి, తెలుగు సరిగా మాట్లాడక పోవడం, అక్కడక్కడా ఆంగ్ల పదాలు ఉపయోగించడం కడు విచారకరం.

**Bhayankar S says:**
March 8, 2011 at 5:36 am
చక్కని పేడ, ఎక్కువ వత్తు లేకుండా, ఎక్కువ వాసన రాకుండా, పేడతో పిడకలు విసురుతున్నారు

**ప్రియా దెయ్యంగారు says:**
March 8, 2011 at 5:39 am
నేను పిషాచాన్ని కాను పిశాచాన్ని

**డప్పు మీసవాసన రావ్ says:**
March 8, 2011 at 5:40 am
నేనెప్పుడో చెప్పాను అది కొరివి దెయ్యం కాదు శాఖినీ దెయ్యం అని,కాని ఎవరూ వినలేదు. మా దగ్గర కపాలం పట్టుకొచ్చే దయ్యాల్నిని కూడా నేను గౌరవిస్తాను అంత మాత్రాన వాళ్ళ జీవితాలు మారిపోతాయా? జెడాంగ్ కోరుకున్న పిశాచ రాజ్యం వచ్చేస్తుందా?

**పాము పెసాదు, says:**
March 8, 2011 at 5:47 am
నేను రెండు మూడు సార్లు వంట చేసాను, అవి **తినని** వాళ్లు పిశాచాలవ్వలేదు. తిన్న వాళ్లను పైకి రానివ్వకుండా యముడు **మోడరేషనులో పెట్టాడు**, అందుకే వాళ్లు పిశాచాలుగా మారారు.

**కూరతీకు ముందరగంటి says:**
March 8, 2011 at 5:48 am

ప్రియా దెయ్యం గారూ పప్పుసారు & చిట్టి దయ్యల గుంపు కలిసి రాస్తున్నారు.. మొన్నటిదాకా పప్పు సారు శ్మశానం లో లేరు అప్పుడు శవం కాలలేదు.. ఆయన నిన్న వచ్చారు వెంటనే నిన్న రాత్రికి శవం కాలింది..
కాబట్టి పిల్ల భూతాల్లారా.. పప్పుసారే ప్రియా దెయ్యంగారు

**గోలధ్వజ కీబోర్డుధ్వని says:**
March 8, 2011 at 5:53 am
ఏ దివిలో కరచిన పాడు దయ్యమో, ఈ భువిలో వెలసిన మారతాండనో

**గోలధ్వాజ్ కీబోర్డుధ్వని says:**
March 8, 2011 at 5:58 am
ఏ దివిలో కరచిన పాడు దయ్యమో, ఈ భువిలో వెలసిన మారతాండనో
ఈ బ్లాగులో పిశాచమై ఉండిపోయెనే ఏ ఏ

**గోలధ్వాజ్ కీబోర్డుధ్వని says:**
March 8, 2011 at 5:59 am
స్త్రీవాదులకు ఇస్త్రీ చేయగా రావే
మార్క్స్ లెనిలను కాటికంపగా రావే
చలం కథలను పాడుచెయ్యగా……భూతప్రేతమై రావే

**జమార్ ఫన్ says:**
March 8, 2011 at 6:00 am
నేను కదండీ బాబు .. నాకసలు పాట పాడడం రాదు

**చిఖిత మందుసేన says:**
March 8, 2011 at 6:16 am
ప్రపంచంలో ఎంతో మంది దెయ్యాలుగా మారిపోతున్నారు…………..నరకలోకం నుంచి పిశాచాల అప్‌డేట్స్ ఇస్తున్నారు…ఇంకా కొంచెం అడ్వాన్సు అయ్యి వచ్చే జన్మలో పిశాచి అవుతారో దెయ్యం అవుతారో కూడా చెప్పేస్తారేమో…ఏమో.. ఎవరికి తెలుసు… 😛

మీరు వచ్చే జన్మలో ప్రియా దెయ్యం మీరే అనచ్చు….బాధరాబాద్ ప్రత్యేక గ్రహాన్ని పీడించే పిశాచం అనచ్చు….అంటే ఎవరు చెవిలో పువ్వులు పెట్టినా మీరు పెట్టించుకోవాలిగా…


**సెమ్యూ అల్లంవారు says:**
March 8, 2011 at 6:36 am
దయ్యాలకు దండవేసి పిశాచాలతో పెండ్లిని చేసే

**బెంగాల్ రాను says:**
March 8, 2011 at 7:01 am
ఊడలు పెళ పెళ లాడే
నా గుండెలు గుభ గుభ లాడే,

వలదన్న వినడీ మరిదీ
కలనైన వదినను తలచు
తన కథల్లో ఇంత పైత్యముందని ఇది నాకు ఇప్పుడే తెలసే

కర్ణభేరి పగిలేనీ వేళా
దూరాన నీగొంతె వినగా
నీ జాడలే లేకున్నచో మా ఊపిరి నిలువిను ఈవేళ

ఇస్కీ బాబా పోస్టే వేసే
నువ్వెళ్ళి కామెంటు రాసే
ఆ దెబ్బతో ఇస్కీబాబా నేమో టేబిల్ కింద దాక్కొని పోయే

**అశుభకరుడు says:**
March 8, 2011 at 8:14 am
కాస్త ఖాళీ దొరికింది ఏదైనా కామెడీ సినేమాకెళ్దాం అని అనుకుంటూ బ్లాగ్లోకంలో ఓసారి అడుగుపెట్టా.. ఇక ఆ సినిమా ఆలోచన విరమించుకోవచ్చుననిపిస్తుంది 🙂
భజన అవిడియాలు అదరహ 🙂
ఏంది మా అన్నాయ్ కి గధాభవన్ అంటే అంత భయమా.. ఇదేదో నమ్మశక్యంగా లేదే 🙂

**..nagarjuna.. says:**
March 8, 2011 at 9:12 am
:))

**శ్రీ says:**
March 8, 2011 at 9:46 am
"నీపేరు పురుగేశనా లేక ఇలాంటి పేరుగల బంధువులు నీకు భూలోకంలో ఎవరైనా ఉన్నారా?" అడిగాను నేను…escalanat.. hi hi heeeeeeeeeeee

**రహ్మానుద్దీన్ షేక్ says:**
March 8, 2011 at 11:37 am
ha ha ha ha ha

**Snkr says:**
March 8, 2011 at 2:18 pm
Brilliant! :))))))))))))) :))))) :))))

/హల్లో this is …. గదా భవన్" అవతలనుండి సమాధానం/

I couldn't correlate this.. what is this gdhabhavan? could nayone clarify me, Pleeeeez..pleeez.

**Snkr says:**
March 8, 2011 at 2:24 pm
బెంగాల్ రాను mee paaTa adurs. :))

**Unnecessary says:**
March 8, 2011 at 3:44 pm
గదా భవన్ అంటే కత పవన్.

**మంచు says:**
March 8, 2011 at 4:01 pm
:-))))

**లస్కర్ "రమ్య" కిరాజా says:**
March 8, 2011 at 4:04 pm
మనిషే మార్తాండ
మనసే ఓ తొండ
మనిషే మార్తాండ
మనసే ఓ తొండ
మెరిసే జీరంగి
కన్నుల్లో ఎర్రరాగం
గుండెల్లో ఏదోతాపం

**బస్సుగర్ గమ్ము రాజా says:**
March 8, 2011 at 4:34 pm
నేలేకున్డా సూసి ఎర్ర తొండ మీన పేరడీలు రాస్చా ఉన్నారే.
ఎర్ర తొండ మీన సర్వహక్కులూ మావే అని బల్లగుద్ది కుండలు పగల్నాకి సెప్తా ఉన్న.

**నల్ల హింస says:**
March 8, 2011 at 4:40 pm
నిన్న కొంచెం కారం రాస్కున్నాను నా నోట్లో

ఆముదం కూడా ఒక్కోసారి ఆనందాన్ని ఇస్తుంటుంది
అందుకేనేమో భగవంతుడు నా మొహం నుండి ఇంకా తీసెయ్యలేదు.

**నల్ల హింస says:**
March 8, 2011 at 4:42 pm
ఇలాంటివి చాల చాలా రాశాను శ్మశానం లో కూర్చొని

http://www.sontaDabbba.blogspot.com

**నల్ల హింస says:**
March 8, 2011 at 4:45 pm
ప్రియా దెయ్యంగార్ బాగుందీ, ఫలానా కారణం వల్ల బాగుందీ అని తెలియజేస్తే చాలు.పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నా

**నల్ల హింస says:**
March 8, 2011 at 4:56 pm
నీ భావాలు పిశాచాన్ని పట్టుకునెదాకా వెళ్తున్నాయ్
నీ ప్రయత్నాలు దెయ్యాలతో మాటాడించేదాకా వెళ్తున్నాయ్
నీ మొహం లో జిడ్డు చీకట్లో కూడా స్పష్టంగా కనిపిస్తుంది.
నీ పిచ్చిచూపు పాడె మీద శవం లా నిశ్చలంగా నిలబడుతుంది
నీ పరుగులు భూతాలని బుకాయిస్తున్నాయి.
నీ అలోచనలు అరిటి కాయలని ఆరాధిస్తున్నాయి.

ఇ మాటలన్నీ నా కవితా పైత్యాల సారమే…

అందుకోండి..

మీ శ్మశానం లో గొయ్యితవ్వాను.
కూలి డబ్బులు ఇంకా ఇవ్వలేదు

**పైత్య says:**
March 8, 2011 at 5:16 pm
శ్మశానం నిండా నిండిన శవాలు – చోటు చాలట్లేదు
నోరారా అరిచిన నక్కల ఊళ – చెవికి చేరటం లేదు
పారబోసిన పాచి కూరలా – రుచి తగ్గలేదు
సిరా మరకలు నా 'చొక్కా' మీద – అవి పోయే మార్గం లేదు!?!

లక్షలకోట్ల దెయ్యాల బడ్జెట్లు – బడుగుభూతాల బతుకులు మాత్రం మారట్లేదు
అస్తికల్లో అన్నీ ఉన్నాయ్- నా మొహంలో జిడ్డు వదలట్లేదు
ఇంటి పక్కనే ఉన్నదో వల్లకాడు – వెళదాం అంటే పర్మిషన్ లేదు

నా పైత్యం తో చెడగొట్టిన ఒక కవిత
**ప్రియా దెయ్యంగారు says:**
March 8, 2011 at 5:18 pm
అబ్బ! ఎంత బాగున్నాయో వీనులవిందుగా

**పులుసు కామెడీహ్మణ్యం, says:**
March 8, 2011 at 5:20 pm
పుదీణ గార్కి,
బరికేద్దామనే సంకల్పం అండీ. అదేమిటీ, మీకు పోస్టేజీ స్టాంపులకి డబ్బుల్లేవా? ఉత్తరాలన్నీ పోస్టు చేయకుండా వదిలేస్తున్నారు? నాకివ్వండి నేను మార్తాండకి పంపిస్తాను, తను ఒరియా భాషలోకి తర్జుమా చెసి, ఆడియో ఉత్తరాలు చేస్తాడంట, అందరూ వినడానికి.

**Kumar N says:**
March 8, 2011 at 5:22 pm
Man, this is something!! Who is this Paithya for?

**బందర్ (కి) దులిపెబూజు says:**
March 8, 2011 at 5:51 pm
పేరు చెప్పనా అతని రూపు చెప్పనా
నీ పేరే మార్తాండ నీ రూపమూ గుండురూపము
నీ చిత్తము చపలచిత్తము
పేరు తెలుసునూ నీ రూపు తెలుసునూ
నీపేరే స్రీకాకుల్ నీరూపమూ ఎర్రరూపమూ
నీ నేస్తము కెనడియన్ యన్నరై

పేరు చెప్పనా
నీ రూపు చెప్పనా
నీ పేరే అనురాగం
నీ రూపము శృంగారము
నీ చిత్తమూ నా భాగ్యము
పేరు తెలుసునూ
నీ రూపు తెలుసును
నీ పేరే ఆనందం
నీ రూపము అపురూపము
నీ నేస్తము నా స్వర్గము

**నిశాచరి అల్లరిపోరు says:**
March 8, 2011 at 6:57 pm
నేనే దెయ్యంగార్, నన్ను కెలికారా మిమ్మల్ని చేస్తా అల్లంచార్,
వింటున్నారా రౌడీగార్,

వస్తా మగధీరనై,
రాస్తా బ్లాగరినై, నే రాస్తా స్త్రీవాదినై
వస్తా మార్తుండనై, పీకుతా దెయ్యాన్నై
తింటా రక్కసినై మీఅందరి మెదడు తింటా రక్కసినై
జోర్ సెయ్ జోర్ సెయ్ జోర్ జోర్ సెయ్ బార్ సెయ్ బార్ సెయ్ బార్ బార్ సెయ్

**అలుగడ్డ హల్వా says:**
March 8, 2011 at 7:33 pm
ఎంత బాగా రాస్తున్నారు ప్రియవీణా, అద్భుతం.
భజన మనసు నరకంలో కూడా బ్లాగుల సుఖమే కోరుకుంటోంది. చాలా బాగా రాసారు.
నరకం నుండి, ఇంతకు ముందు ఎర్త్ కి రాసిన ఉత్తరం, ఇప్పుడు ఇది…నిజంగా హెడ్స్ ఆఫ్..మా తలలు తెగాయ్, మార్తాండ మాటల్తో .
ఉంటాను
అ. హల్వా

**ఊరికి పెట్ట says:**
March 8, 2011 at 7:39 pm
@సువార్త
సువార్త గారు, నా కూత కొత్తదే కానీ, నేను కొత్త కాదు. మీ పప్పు ధాన్యాల్ని, నేను అది మీరు విదిల్చినప్పుడే బుక్కేసాను. చాలా బాగా విసిరారు.

**"చే"క్యూబ్ says:**
March 8, 2011 at 7:57 pm
జారిపోతున్న వలువల వంక చక్కగా చూసాం సార్. ఇదంతా "అదనపు విలువ"లు ఉండే కాపిటలిజం కుట్ర అని మార్క్స్ ఏనాడో, మార్తాండ ఈనాడే చెప్పారు.

**ద ఇన్విన్సిబుల్ మెంటల్ గోడు says:**
March 8, 2011 at 8:13 pm
మధ్యతరగతి యువతలో 1970 ల నాటి సామాజిక గజ్జి – తద్వారా జరిగిన రాపిడి – దాంట్లోంచి వచ్చిన భావప్రాప్తి కి నిదర్శనం..

ఇంకెవరు నేనూ, మా బామ్మర్ది.

**ద ఇన్విన్సిబుల్ మెంటల్ గోడు says:**
March 8, 2011 at 8:22 pm
మధ్యతరగతి యువతలో 1970 ల నాటి సామూహిక గజ్జి – తద్వారా జరిగిన రాపిడి – దాంట్లోంచి వచ్చిన భావప్రాప్తి కి ఈనాటి నిదర్శనం..

ఇంకెవరు నేనూ, నా బామ్మర్ది.

**Bhaskar Ramaraju says:**

March 9, 2011 at 1:27 am

బస్సుగర్ గమ్ము రాజు :):)

**రహ్మానుద్దీన్ షేక్ says:**

March 9, 2011 at 12:24 pm

http://www.sontaDabbba.blogspot.com

ఇది లేదు

నాకు ఈ బ్లాగు కనబడటం లేదు

**తాబేలుపల్లి says:**

March 9, 2011 at 3:27 pm

మనమంతా సకూచిని వేటాడదాం

**రహ్మానుద్దీన్ షేక్ says:**

March 10, 2011 at 2:04 pm

అసలేం జరుగుతుందిక్కడ?

**Blog at WordPress.com.**